

రవిశంకర్ పిక్చర్స్ వారి

# మేనకోడలు

నిర్మాత:
వై. సునీల్ చౌదరి

దర్శకత్వం
బి.యస్. నారాయణ

# తెర ముందు

| | | |
|---|---|---|
| కృష్ణ | .... | జమున |
| గుమ్మడి | .... | సూర్యకాంతం |
| రాజబాబు | .... | కల్పన |
| కె. వి. చలం | .... | రేణుక |
| రావు గోపాలరావు | .... | ఉదయలక్ష్మి |
| ఆనంద్ బాబు | .... | శ్యామల |
| సిహెచ్. కృష్ణమూర్తి | .... | శాంతిశ్రీ |

ఇంకా

నల్లరామ్మూర్తి, అశోక్ కుమార్, కోళ్ళ సత్యం,
మోదుకూరి సత్యం, ఎ. యల్. నారాయణ,
డి. నరశింహారావు, పి. చలపతిరావు, పొట్టి వీరయ్య,
యు. గిరి మరియు జూనియర్ భానుమతి.

బాల తారాగణం :

మాష్టర్ మోహన్, మాష్టర్ విశ్వేశ్వరరావు,
బేబి శ్రీదేవి, బేబి సరోజిని.

నాట్యతార : హాలం

అతిథి నటులు : సత్యనారాయణ, డా॥ రమేష్.

# సంక్షిప్త కథ

అహంకారి, గర్విష్టి, గయ్యాళి అయిన దుర్గమ్మ (సూర్యకాంతం) చలపతి (గుమ్మడి) కి రెండవ భార్య. తన కొడుకు వెంకట్ (రాజబాబు) కూతురు శశి (రేణుక) లను మాత్రం బాగా చూసుకొంటుంది కాని సవతి కొడుకైన సుందరంను మాత్రం అనేక బాధలకు గురిచేస్తుంది.

దుర్గమ్మ తమ్ముడు మూర్తి (సి. హెచ్. కృష్ణమూర్తి) పరాయి కులానికిచెందిన స్త్రీని వివాహం చేసుకొన్నకారణంగా అతనితో సంబంధాలు తెగత్రెంచుకొంటుంది. ఆ తరువాత అతడు వ్యాపారంలో లక్షలు గడిస్తాడు. తీవ్రజబ్బుకు గురైౖ మూర్తి భార్య చనిపోవడంతో యింటికి ఆడదిక్కుగా అక్క కుటుంబాన్ని పట్నానికి రావలసిందిగా అభ్యర్థిస్తాడు. విచిత్ర పరిస్థితులలో అతడు మరణిస్తాడు.

దుర్గమ్మతో సుందర్ కు (కృష్ణ) తగాదావచ్చి దుర్గమ్మను బాగాకొట్టి సుందర్ యింట్లోంచి పారిపోతాడు. తన కిష్టంలేని ఆడబడుచుకు పుట్టిన మూర్తి ఏకైక కుమార్తె సుశీల (జమున) అంటేకూడ దుర్గమ్మకు చెడ్డ కోపము. సుశీల చదువు మాన్పించి వొక బానిసగ తయారు చేస్తుంది.

ఇంటినుండి పారిపోయిన సుందర్ విచిత్ర పరిస్థితులలో చిదంబరం (సత్యనారాయణ) అనే వొక లక్షాధికారి అభిమానం పొందడం, అతని ఆశ్రయంలో సొంత కుమారుడిలా పెరిగి పెద్దవాడై, అతని వ్యాపారంలో భాగంపొంది లక్షలు గడించటం అంతా లీలగా జరిగిపోతుంది.

సుశీల జీవితం ఆలాగే బలీయమైన సంఘర్షణతో సాగుతూ వుంటుంది. విద్యాధికుడైన వ్యక్తికిచ్చి సుశీలను వివాహంచేస్తే అతడు ఆ ఆస్తిపై ఆక్రమణ చేయగలడని అమాయకుడు వృద్ధుడైన గోవిందయ్య (నల్లరామూర్తి) కిచ్చి చేయబోతుంది ఈ వివాహం చేసుకోవడం యిష్టంలేని సుశీల యింట్లోంచి పారిపోతుంది. పారిపోతున్న సమయంలో కాలుజారి కారుక్రిందపడితే సుధీర్ అనే సహృదయుడు ఆమెను రక్షిస్తాడు. ఆమె దీనమయ గాథను తెలిసికొన్న అతడు ఆమెకు ఆశ్రయం కల్గిస్తాడు.

# 4

శశి, శంకర్ (కె. వి. చలం) అనే వొక కారు మెకానిక్‌ను ప్రేమిస్తుంది, అతడు తనొక లక్షాధికారినని చెపుతూ శశిని మోసం చేయడమే కాకుండ గర్భానికి గురిచేస్తాడు. వెంకట్ చదువుకు స్వస్తిచెప్పి త్రాగుడు, జూదం, స్త్రీ వ్యామోహాలకు గురి అవుతాడు.

సుశీలకు జరగవలసిన ముహూర్తానికి ఊహించని విధంగా శశి పెళ్ళికుమార్తె కావలసివస్తుంది. దానితో శశి జీవితమే నరకమౌతుంది.

శంకర్‌కు డబ్బు అవసరమయినప్పుడల్లా శశి దగ్గరకొచ్చి బెదిరిస్తుంటాడు. తనకు శశికి వున్న అక్రమ సంబంధాన్ని కూడ గోవిందయ్యకు చెబుతాడు. చెల్లాచెదురైన దుర్గమ్మ కుటుంబములో మనశ్శాంతి లేని చలపతి యింటినుంచి వెళ్ళిపోతాడు.

సుధీర్ ఆశ్రయంలో సుశీల జీవితగమ్యమే మారిపోతుంది ఆమె జీవన వసంతం చిగురిస్తుంది. తన మనోమందిరంలో అతడు చోటు చేసుకుంటాడు. ఇద్దరు వైవాహిక జీవితంలో ఆనందడోలికలో అనుభవిస్తున్న శుభతరుణంలో ప్రభుత్వాన్ని మోసగిస్తున్నాడన్న నేరంతో పోలీసులు సుధీర్‌ను అరెస్టు చేశారు.

అయితే సుధీర్ ప్రభుత్వాన్ని చేస్తున్న ఆ మోసం ఏమిటి ?

భర్తదగ్గర తనరహస్యం బయటపడిన శశి భవిష్యత్తు ఏమిటి

అమాయకులైన అమ్మాయిల జీవితాలతో ఆటలాడుకోవటమే జీవిత వుద్యోగంగా భావించే శంకర్ తుదకు ఏమౌతాడు ?

త్రాగుడు, జూదం మున్నగు వ్యసనాలకు బానిసయిన వెంకట్ పరిస్థితి ఏమిటి ?

అహంకారముతో, గర్వముతో విర్రవీగే దుర్గమ్మలాంటి వాళ్ళకు రావలసిన బుద్ధిపారమేమి ?

ఇంట్లోంచి వెళ్ళిపోయిన చలపతి ఏమౌతాడు ?

మరల సుశీల జీవితంలో నూతన వసంతం చిగురిస్తుందా ?

పై ప్రశ్నలకు సమాధానంగా రవిశంకర్ పిక్చర్స్ నిర్మించిన 'మేనకోడలు' చిత్రం వెండితెరపై చూచి ఆనందించండి.

# పాటలు

## పాట నెం. 1 నేపథ్య గీతం

రచన : శ్రీ శ్రీ | పాడినది : పద్మశ్రీ ఘంటసాల

పల్లవి : బ్రతుకే చీకటాయె
తనువే భారమాయె
ఎటు చూచినా
ఎటు పోయినా
ఏదారి లేకపోయె ॥బ్రతుకే॥

చరణం 1: మమకారాలే దూరమాయె
మంచితనమే నేరమాయె
నాయనువారే లేరాయే
కన్నీరే సెలయేరాయె ॥బ్రతుకే॥

చరణం 2: గృహమందే అరాచకాలు
దినదినమూ పరాభవాలు
దుర్మార్గుల దురాగతాలు
పొందుసులే పరాభవాలు ॥బ్రతుకే॥

## పాట నెం. 2

రచన : దాశరథి | పాడినది : సుశీల

పల్లవి : తిరుమల మందిర సుందర
సుమధుర కరుణా సాగరా
యే పేరున నిను పిలిచేనురా
యే రూపముగా కొలిచేనురా

చరణం : పాలకడలిలో శేషశయ్యపై
పవళించిన శ్రీపతివో
వెండికొండపై నిండు మనసుతో
వెలిగే గౌరీపతివో
ముగురమ్మలకే మూలపుటమ్మగ
భువిలో వెలిసిన ఆదిశక్తివో ॥తిరుమల॥

చరణం : కాంతులు చిందే నీ ముఖబింబము
కాంచిన చాలును గడియైనా
నీ గుడివాకిట దివ్వెను నేనై
వెలిగిన చాలొక రేయైనా
నీ పదములపై కుసుమము నేనై
నిలిచిన చాలును క్షణమైనా ॥తిరుమల॥

పాట నెం. 3

రచన : కొసరాజు పాడినది : సుశీల, ఘంటసాల

శశి: పల్లవి: వయసు కులుకుచున్నది
వలపు నిలవకున్నది
మనసంతా నీమీదే వున్నది
నీవురాకపోతే గుబులుగుబులుగున్నది

చరణం : 1 ఎదురుగ నువు నిలుచుండి
ఎకసక్కాలాడుతుంటె
ముసిముసి నవ్వులతోటి
ముద్దులు కురిపిస్తుంటె
ఆశలు పెంచుకొని
ఆనందం పంచుకొని
పట్టరాని మమతపొంగి
పరవశమౌతున్నాను

వెంకట్:పల్లవి: హల్లోహల్లో మైలేడీ
వచ్చావా నాజోడి
నీకోసం చూస్తున్నా
పడిగాపులు కాస్తున్నా ॥హల్లో॥

చరణం : 1 నీగాలి సోకితెచాలు
నామనసు నీమీదవాలు
నీచేయ్ తగిలితే నావొళ్ళంతా
జిల్ జిల్ జిల్ మంటూనోలూ ॥హల్లో॥

చరణం 2　　నిను చూడకపోతేనాకు
అహ నిద్దురకూడా బ్రేకు
ఓజిలిబిలి వెన్నెల చిలకల కొలికి
రా రా రా షికారుకు
హల్లో హల్లో మైలేడీ
వచ్చావా నాజోడి
హల్లో హల్లో మైలేడి
డూ డూ డూ
డూ డూ డూ
డి డి డీ డీ డూ డూ........

పాట నెం. 4 నేపథ్య గీతం

రచన : శ్రీశ్రీ　　పాడినది : పద్మశ్రీ ఘంటసాల
సాకీ :　అమ్మా ! యీ నిరాశామయనిశీధివేళ
గమ్యమే కనరాని యీ పయనమేలా

పాట నెం. 5

రచన : డా॥ సి. నారాయణరెడ్డి　　పాడినది : పద్మశ్రీ ఘంటసాల, సుశీల

పల్లవి : సుధీర్ :　ఈ సిగ్గు దొంతరలు ఎన్నాళ్ళు ?
ఈ వయసు తొందరలు ఎన్నాళ్ళు ?
సుశీల :　ఎన్నాళ్ళో ?
సుధీర్ :　నా మనసు నీ మనసు తెలిసేదాక
నా పెదవి నీ పెదవి కలిసేదాక　॥ఈ సిగ్గు॥

చరణం : సుశీల :　అలలాగా
వెన్నెలలాగా
నవ్వులముకొంటె నా మనసే ఆగునా
కనుగీటి
బుగ్గనుమీటి
నువ్వు పెనవేస్తె నా వలపే దాగునా

సుధీర్ : దాగని ఆ వలపే కావాలి
నువ్వు నా దానివై వుండిపోవాలి
సుశీల : ఆఁ
సుధీర్ : ఊఁ
ఈ సిగ్గు దొంతరలు ఎన్నాళ్ళు
ఈ వయసు తొందరలు ఎన్నాళ్ళు
సుశీల : నా కొంగు నీ కొంగు కలిపేదాక
కళ్యాణరాగాలు పలికేదాక
అందాకా, అందాకా

* * *

చరణం 2 : సుధీర్ : పుత్తడి బొమ్మలా వున్నావు
పున్నమి వూవులా వున్నావు
సుశీల : మల్లెల పాన్పుమీద వున్నావు
చలచల్లగా మెల్లగా అల్లరి పెడుతున్నావు
॥ఈ సిగ్గు॥

చరణం 3 : సుశీల : పచ్చగసాగె మనకాపురం
ప్రణయ మందిరానికె గోపురం
సుధీర్ : ఎపుడో నాలో సగమైనావు ; ఇం
కెందుకె ; ఓ చెలీ ఉలికులికిపడతావు
పల్లవి : సుధీర్ : ఈ సిగ్గు దొంతరలు ఎన్నాళ్ళు
ఈ వయసు తొందరలు ఎన్నాళ్ళు
సుశీల : చిన్నారి పాపాయి కలిగేదాకా
ఇన్నాళ్ళ పైడికలలు పండేదాకా
అందాకా, అందాకా

పాట నెం. 6

రచన కొసరాజు   పాడినది : పి. సుశీల
రమణి: పల్లవి: చిన్నదాన్ని....
**చిన్నదాన్ని చిరుబొగరున వున్నదాన్నిలే**

కైపులోన....
కైపులోన కవ్వించె కన్నెవయసుదాన్నిలే ॥చిన్నదాన్ని॥

చరణం 1 : కనుసైగలతోటి నిన్ను కరిగిస్తానోయి
ఒయ్యారం చూపి నిన్ను వూపేస్తానోయి
నేటి సుఖము చూసుకో
రేపు మాట మరచిపో
గిలిగింతలు కలిగించి వలపు తీర్చుకో ॥చిన్నదాన్ని॥

చరణం 2 : మహామహులె అందానికి దాసులైనారు
యోగులె జపమాలవదలి భోగులైనారు
చేవలేని అసమర్థులు చెబుతుంటారేమేమో
అనుభవించవోయి అందులోని హాయి ॥చిన్నదాన్ని॥

## పాట నెం. 7.

రచన : దాశరథి | పాడినది : పి. సుశీల

సుశీల : పల్లవి : ఆశలు విరిసె
కాంతులు మెరిసె
అరుణోదయ శుభవేళా
అరుణోదయ శుభవేళా ॥ఆశలు॥

చరణం 1 : పూవులన్ని దేవదేవుని
నవ్వులుగా విరబూసేను
గువ్వలన్ని నా మదిలోనె
కోరికలై విహరించేను ॥ఆశలు॥

చరణం 2 : నీడలేని చిన్నారి చిలకకు
గూడు దొరికినది యీనాడె
వాలిపోయె మల్లెతీగెకు
పందిరి అందెను యీ రోజె ॥ఆశలు॥



# తెర వెనుక

| | | |
|---|---|---|
| కథ | : | మాదిరెడ్డి సులోచన "శిక్ష" నవల ఆధారం |
| స్క్రీన్ ప్లే - డైలాగ్సు | : | దాసరి నారాయణరావు |
| పాటలు | : | దాశరథి, కొసరాజు, శ్రీశ్రీ, డా॥ సి. నారాయణరెడ్డి. |
| సంగీతం | : | పద్మశ్రీ ఘంటసాల |
| నేపధ్యగానం | : | పద్మశ్రీ ఘంటసాల, పి. సుశీల. |
| నృత్యం | : | టి. సి. తంగరాజన్ |
| ఫొటోగ్రఫీ | : | వి. వి. ఆర్. చౌదరి |
| కళ | : | పి. పి. రాయ్ చౌదరి |
| ఎడిటర్ | : | సి. భక్తవత్సలం |
| పబ్లిసిటీ డిజైన్స్ | : | రామారావు ఆర్ట్సు |
| ప్రెస్ పబ్లిసిటీ | : | వి. కె. ఎడ్వర్టయిజర్స్ |
| కాష్ట్యూమ్స్ | : | బి. సుబ్బారావు, సత్యం. |
| మేకప్ | : | జి. నరసింహులు, రమేష్, జె. మాధవరావు. కృష్ణ, సి. మాధవరావు |
| నిర్వహణ | : | కొసరాజు సుబ్బారావు |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : | ధన కోటేశ్వరరావు, కొమ్మినేని కృష్ణమూర్తి. |

డైరెక్టర్ :

## బి. యస్. నారాయణ

నిర్మాత :

## వై. సునీల్ చౌదరి

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ : అనిల్ ప్రభాస్ ఎంటర్ ప్రయిజెస్.

పాటల పుస్తకం వెల : 10 పైసలు

విడుదల: **నవయుగ**

స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ-4.